# శతకము

## మాటూరు వేంకటేశ విరచితము.

ప్రకాశకులు:

యీ గ్రంథకర్తగారి మనుమడగు

భూగిగుణాజాల శతకమును రచించిన

మాటూరు వేంకటప్పయ్యగారి పౌత్రుడగు

మాటూరు అప్పారావు.

---

మ॥ మాటూరు లక్ష్మీనరసింహారావు

బ్ర॥ ప్రతాప వేంకటేశ్వరశాస్త్రి శతావధాని గార్లచే

సరిచూడబడినది.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1933.

రామచంద్ర సహాయం





# మాటూరువాస శతకము.

క॥ శ్రీరమణీధవ కేశవ । నారదహృత్కమల భృంగ । నంద
తనూజా । క్షీరనిధిశయన యచ్యుత । మారసహస్రస్వరూ
ప । మాటూరివాసా॥ ౧

క॥ శ్రీకర మునిజన హృదయవ । శ్రీకరకరుణాకర శశి । శేఖర
నుతశౌ । భాకరయంజనభీకర । మాకభినుతములనొసం
గు । మాటూరివాసా॥ ౨

క॥ ధారుణీధరనుత ధూర్జటి । భారతిపతి వినుతశౌరి । ప
ద్మదళాక్షా । వారణ శోకనివారణ । మారమణను మేరు
ధీర । మాటూరివాసా॥ 3

క॥ మాటిగ నీకథలన్నియు । ధాటిగ శతకంబుజెప్పి । తద్ద
యు భక్తిన్ । జాటెదని మాహాత్మ్యము । మాటికి మాటికిని
ఈశ । మాటూరివాసా॥ ౪

క॥ అరిజనమర్దన సుగుణా । కరకనకాచలనివాస । కారు
ణ్యనిధీ । కరివరదలోకనాయక । మునువలె పూజింతు నిన్ను ।
మాటూరివాసా॥ ౫

కం॥ మురహార నరహరి వామన । సురవినుత విదూరకమల॥ శోభితవక్షా । గిరిసుతపూజితపదయుగ। మరిగితినను గావవ య్య • మాటురివాసా॥ ౬

కం॥ నారాయణ గోపాలక । పారాశరమానివంద్య • వస్న గతల్పా। యేరీనీసమదైవము । మారెన్న గ వేల్పులందు• మాటురివాసా॥ ౭

కం॥ బృందావన సంచారణ । నందాత్మజ చక్రపాణి • నర సఖహారిగో । విందాముర హార,యాశ్రిత।మందార యహీ శశయన • మాటురివాసా॥ ౮

కం॥ ఉర్వీభారనివారణ । దర్వీకరరాజవినుత • దర్పకజనకా। గర్వాసురమదభంజన । మర్వకనినుగొల్తు నెపుడు • మా టురివాసా॥ ౯

కం॥ మాటికినిన్ను దలంచిన । గోటనుమీటినటుబోవు •ఘో రభవంబుల్ । సాటెద నెల్లెడనిట్లని। మాటలు వేయేల నింక • మాటురివాసా॥ ౧౦

కం॥ రక్కసివిషకుచదుగ్ధము।లక్కటరుచిపుట్టగుడిచి•యద్భుత లీలన్। గ్రక్కున దానవి జంపితి । మక్కువనిను మరచు బోగడ • మాటురివాసా॥ ౧౧

కం॥ ముద్దులుజూపుచునందుని । ముద్దుల తనయుండవైన • ముజ్వల శక్తిన్। బెద్దలు నబ్బురమొందగ ।మద్దులు పడం గూల్చితీవు మాటురి వాసా॥ ౧౨

కం॥ బాలుడవయ్యును గోప । స్త్రీలను వలపించి ప్రీతి • జే కొంటివి నీ । లీలలు యద్భుతములు వన।మాలాధర దివ్య లాస • మాటురి వాసా॥ ౧౩

కం॥ హార నజులకైన జిక్కని । పరమాత్ముఁడకీవు గోప ♦
భామినులకు నం। దరికిం జిక్కి మెలంగిన । మరుగులు గన
లేరె వారు ♦ మాటూరివాసా॥ ౧౪

కం॥ నందుని నుండలు బడసం । క్రందను డాగ్రహమున నవడి ♦
రాల్లురిపింపఁగ । నందుఁడు మొరబెట్టినన । న్మందిరముగ
జేయవె గిరి ♦ మాటూరి వాసా॥ ౧౫

కం॥ మట్టితినఁ దల్లినిన్నుం । గొట్టిన నోర పుడు దెరచి ♦ గొ
బ్బున జగముల్ । గట్టిగ జూపవె హరియే । నుట్టుకు నిన్గన
వశంబె ♦ మాటూరివాసా॥ ౧౬

కం॥ ఆపద వేళను భక్తిని। మీపదయుగళము దలంప ♦ మే
లుగఁ జీరెల్। ద్రౌపదికి నక్షయుంబుగ। మాపతి నీవీయలేద ♦
మాటూరివాసా॥ ౧౭

కం॥ హరిసుతునకు సారథివై । కురుబలమంతయును గూల్చి ♦
కూరిమిఁ బోడన్। ధరణీరాజ్య మొసంగవె। మరి కౌంతేయు
లకుఁ గృష్ణ ♦ మాటూరివాసా॥ ౧౮

కం॥ కురుపాండవ సఖ్యతకై । కరిపురమున కేగి వారి ♦ కందువ
గని ని । ర్జరరిపు మర్దన కోపమ । మరజూపవె దివ్య
రూపు ♦ మాటూరివాసా॥ ౧౯

కం॥ సొగసైన వనితరూపముఁ। దగఁ దాల్చియు దైత్యకోటి ♦
తల్లడపడఁగా । నగధర సుధ సురలకుఁ గ। మ్మగ ద్రాగనొ
సంగితివె ♦ మాటూరివాసా॥ ౨౦

కం॥ రక్షిత మునిబృందారక । పక్షికులాధిపతురంగ ♦ పం
కజనాభా । వక్షస్స్థల మణిశోభిత । మక్షిక సమదైత్యభా
వ ♦ మాటూరివాసా॥ ౨౧

కం॥ శ్రీధరణీధర, లక్ష్మీ । నాథసురేశ వినుత యదు ♦ నం
దన పీడా । వ్యాధి వినాశనశుభకర । మాధవను నేలు
కొమ్ము ♦ మాటురివాసా॥ ౨౨

కం॥ కమలజుఁడాదిగ నమరులు । విమలముగాఁ దెలియలేరు ♦
వెన్నుఁడ నిన్నున్ । విమతుఁడ నేనెటుగనియెద । మమకార
వికారపరుఁడ ♦ మాటురివాసా॥ ౨౩

కం॥ ఎన్ని విధంబులభక్తుని । మన్నన జేయుటకు నీవె ♦ మాధ
వ యికనీకన్నను నెవరినెరుగనుగా । మన్ననఁ గావాఁడ
మయ్యా ♦ మాటురివాసా॥ ౨౪

కం॥ మన్నింపుము నారాయణ । సన్నుతిఁ జేసెదను నిన్ను ♦
సకలవిధములన్ । మన్ననకుఁ దగినదాసుఁడ । మన్నన నను
జేయుమయ్య ♦ మాటురివాసా॥ ౨౫

కం॥ కంటిని నీపదయుగళము । వింటిని నీకథలనెపుడు ♦ వేడు
కతోడన్ । యుంటిని మీబంటుగ నే । మంటిని నిను ।
గావుమంటి ♦ మాటురివాసా॥ ౨౬

కం॥ ఖరకర హిమకరనేత్రా । సిరివరశతకంఠవినుత ♦ చిన్మ
యరూపా । కరుణను జూడుము నను యేమరకుము కరు
ణాబ్ధిచంద్ర ♦ మాటురివాసా॥ ౨౭

కం॥ ఇందిరవల్లభ హరిగో । వింద ముకుంద కమలాక్ష ♦ వేద
స్తుత్యా । నంద తనూభవ సురగిరి । మందిర సుగుణాల
వాల ♦, మాటురివాసా॥ ౨౮

కం॥ అంబిక! జపదేవత కన । కాంబర! విశ్వంభర! నర ♦ కాసుర
హరణా । యంబురుహానయన నిను నిగ । మంబులు కొని
యాడునెపుడు ♦ మాటురివాసా॥ ౨౯

కం॥ నిన్ను నుతింపఁగఁజాలను । యెన్నికగల బ్రహ్మరుద్రు ♦ లెన్నఁగలేకే । యున్నయెడ నెంతవాఁడను । మన్ననకేఁ దగినవాఁడ ♦ మాటూరివాసా॥ 30

కం॥ గోవింద! నీదుకీర్తన । గావించిన జనులకెల్ల ♦ గల్గుశు భంబుల్ । సేవించెద నిన్నెప్పుడు । మావిన్నప మాల కించు ♦ మాటూరివాసా॥ 31

కం॥ దాసుఁడనై భువియందున । భాసురముగ నీదుకథలు ♦ బాడుచునుందున్ । నీసరి దైవములేదని । మా సతిపతి చాటువాఁడ ♦ మాటూరివాసా॥ 32

కం॥ ఎంచితి నీమహిమంబులు । కొంచెము నామీఁదకరుణ ♦ గొనుటయె చాలున్ । సంచితభవములు బాయును । మంచుతొలఁగిపోవుభంగి ♦ మాటూరివాసా॥ 33

కం॥ వికసిత వనరుహనేత్రా । సకలామర కోటివంద్య ♦ సర్వా ధ్యక్షా । బకశకట దైత్యమర్దన । మకరాలయ ద్పృఢని వాస ♦ మాటూరివాసా॥ 34

కం॥ మకరికి జిక్కియు కరివరుఁ । డకలంక మనస్కుఁడౌచు ♦ నాత్మఁ దలంపన్ । బ్రకటముగ నతనిగాచితి । మకరేం ద్రుని ద్రుంచివైచి ♦ మాటూరివాసా॥ 35

కం॥ సనకసనందనసేవిత । యనిమిషపతివినుతశౌరి ♦ యబ్ధివి హారా । ననుగావుము నీదాసుఁడ । మనసిజ శతకోటి రూప ♦ మాటూరివాపా॥ 36

కం॥ చక్రాయుధసర్వేశ్వర । శక్రార్చితపాదపద్మ ♦ శర్వాణి నుతా । శుక్రాప్తశిష్యహరరా । మాకుచగిరిమధ్యవాస♦ మాటూరివాసా॥ 37

కం॥ కదలనిచాపధరుండును । వదలకనిన్నెపుడుదలచి • వాసికి
నెక్కెఁ । ముకమున నీకుపొందగువిధి । మదికింపుగసృష్టి జే
యు • మాటూరివాసా॥ ౩౮

కం॥ జలచరరూపముదాల్చియు । జలనిధిలోనిగముచోరు •
జంపియు వేదం । బులనువడదయతోడఁగ । మలజున
కు నొసంగితయ్య • మాటూరివాసా॥ ౩౯

కం॥ సురరాక్షసవర్యులుమం । ధరగిరి కవ్వముగనబ్ధి • ద్రచ్చఁ
గ జగముల్ । దెరలిభయంపడకరుణ న । మరితివికూర్మంబ
వగుచు • మాటూరివాసా॥ ౪౦

కం॥ కనకాక్షుండవనిఁ జేకొని । వననిధికింజనిన నపుడు • వాని
వధింపఁగ । గనలుచుసూకరమైతివి । మనసొప్పక చిత్రప్రకాశ •
మాటూరివాసా॥ ౪౧

కం॥ నరహరివై రౌద్రంబున । నరభోజుని నొడసిపట్టి • నఖ
ములచే, వేఁ। దరుచుగజీరివధించితి । మరి నినుఁ బొగడంగవశమె
మాటూరివాసా॥ ౪౨

కం॥ బలిఁగనుగొని మూడడుగులు । యిలదానమునడిగిపట్టి •
యింద్రాదులకై । బలిబంధింపవె వామన । మలసుతజప
మాలమంత్ర • మాటూరివాసా॥ ౪౩

కం॥ ధరణిగలరాజులందర । నిరువదియొకమారుద్రుంచి • యి
లఁ బ్రఖ్యాతిఁ । బరగిన భార్గవరామ య । మరసేవితపాద
పద్మ • మాటూరివాసా॥ ౪౪

కం॥ దశరథతనయుఁడవై దశ । దిశలనునీయశమునిండ • దివి
జులుపొగడఁ । దశముఖునిద్రుంచివైచితి । మశకసమానము
గజూచి • మాటూరివాసా॥ ౪౫

కం॥ యదువంశంబున బుట్టియు। మదకలితుల, ధేనుకాది • మ
నుజాశనులన్ । మదమణచి జగముగాచుట । మదినిం
బలరామతలంతు • మాటూరి వాసా॥ ౪౬

కం॥ పురములు మూడు జయింపగ । హరుఁడరుగ నసాధ్యమైన •
నద్భుతభంగిన్ । శరరూపమై జయించితి । మరిబుద్ధుడ
వౌచు నీవు • మాటూరివాసా॥ ౪౭

కం॥ కలినిం గలి కాల్కుడవై । కలిపురుషుల నెల్లజంపి • కాశ్యపిని
ఖిలా। ఖిలధర్మంబులు మరిని। ర్మలముగ నిల్పెదవు నీవు • మా
టూరివాసా॥ ౪౮

కం॥ ముదమున నినుఁగొనియాడెద । వదలక నీపాదయుగము
భజియింతు దగన్। యదువంశోద్భవ యిక నా। మదిఁగోరిన
కోర్కెలిమ్ము • మాటూరివాసా॥ ౪౯

కం॥ దీనజన రక్షకత్వము । పూనిన దైవంబవీవె • పురహర
వినుతా । దీనుని ననుఁ గృపజూడుము । మౌని మనఃపద్మ
భృంగ • మాటూరివాసా॥ ౫౦

కం॥ చదువులు చదువుట నెల్లను। చదువరియై తాను ధనము•
సంపాదించున్ । మదమణచి నిన్ను నెంతయు । మదినిం
గన లేడు నరుడు • మాటూరివాసా॥ ౫౧

కం॥ తీపిగల తేనెఁగోరక । వేపల చవిఁగోరునట్టి • వెఱ్ఱియు
గలడే। పాపహర నిన్నుఁగొల్చెద। మాపతియిక నెవరిఁగొల్వ•
మాటూరివాసా॥ ౫౨

కం॥ రారా యదువంశోద్భవ । రారా మునిమానసాబ్జ • రా
జీవాక్షా। ధీరోదార రమేశ్వర । మారామ నిధాన రార •
మాటూరివాసా॥ ౫౩

కం॥ తలఁచెదఁ బరతత్త్వంబులు । బలచెదనీకథలువినఁగ ♦ భ
క్తనిధానా । విఱచెదను మోహారశ్ముల । మఱచెద నిహ
లోక సుఖము ♦ మాటూరివాసా॥ ౭౦

కం॥ నిలచెద నిర్మలబుద్ధిని । దలఁచెద నీ ప్రాభవంబు ♦ తద్ద
యుభక్తిన్ । గొలిచెద నీచరణంబులు । మరచెదనజ్ఞాన
బుద్ధి ♦ మాటూరివాసా॥ ౭౧

కం॥ నందతనూభవ సురగిరి । మందిరగోపాల కృష్ణ ♦ మన్నిం
పుదయన్ । వందనములాచరింతు న । మందకటాక్షమున
జూడు ♦ మాటూరివాసా॥ ౭౨

కం॥ దారాపుత్త్రాదులతో । గారాములు సల్పుచుండి ♦ కమ్మ
నియటుకుల్ । చారెడు కుచేలుడిచ్చిన । మారొప్పగ సిరుల
నీవె ♦ మాటూరివాసా॥ ౭౩

కం॥ నిర్గుణరూపుఁడవయ్యును । సర్గస్థితిలయము సేయ ♦ సగుణుండ
వునై । భర్గస్తుతశౌర్యాదు । ర్మార్గుల యేపడఁచితీవు ♦
మాటూరివాసా॥ ౭౪

కం॥ పరమబ్రహ్మంబవు న । స్థిరజనపదమునను నీవు ♦ శ్రీ
కృష్ణుఁడవై । చరియించు నీకు నే నం । బరమున వేమ్రొ
క్కులిడుదు ♦ మాటూరివాసా॥ ౭౫

కం॥ ఉరగులదొర వేనోళ్ళను । పలుమరు నినుబొగడలేక ♦ పం
డియునిగిడెన్ । నరుడను మూఢుఁడనజ్ఞుఁడ । మఱినిను ను
తిఁజేయఁగలనె ♦ మాటూరివాసా॥ ౭౬

కం॥ ఎందునఁజూచిననగపడ । వందురుగనుఁగొనఁగ వేడ్క ♦
నభిమతబుద్ధిన్ । బొందితపించిన దొరకవు । మందలఁజరి
యించుటెట్లు ♦ మాటూరివాసా॥ ౭౭

కం॥ సంసారమునిస్సారము । హింసాకరమానుగాన • హే
యంబనుచున్ ।కంసారిన్ భజియించెద । మాంసాశననాశ
యాశ • మాటూరివాసా॥ ౨౮

కం॥ అసమశరజనక మురహర । లసత్కనకవసనవిమల • లా
లితనయనా । ముసలాయుధననుజన్ముడ । మసలక నను
నేలుమయ్య • మాటూరివాసా॥ ౨౯

కం॥ వనచరబలములతోఁడను। వననిధి బంధించివేగ • వంచ
నసేతన్। గొనిపోయినదశకంఠుని । మననీయక జంపితీవు •
మాటూరివాసా॥ ౩౦

కం॥ అరిషడ్వర్గంబులుధర।నురుమాడినపిదపగాని • నుత్తమగ
తులన్ ।బరిపూర్ణతనీయువుయని।మరువకయరివర్గమణఁతు•
మాటూరివాసా॥ ౩౧

కం॥ అక్కటయెంతగవేడిన । నొక్కటెసుఖమైనమాట• ను
డువగరాదే।నిక్కపుదాసుఁడనన్నున్ । మక్కువగాఁజూ
డవయ్య • మాటూరివాసా॥ ౩౨

కం॥ చంచలమగు యిహసుఖముల । వంచనపడిచాలవిసికి •
వాక్కున మిమ్మున్ । యెంచితిదాసుఁడనైతిని।మంచిగనీ
భజనసేతు • మాటూరివాసా॥ ౩౩

కం॥ కాయంబస్థిరమనియును। కాయజ సంహారవినుత • గట్టి
గమిమ్మున్ । బాయని భక్తిదలంచిన । మాయనుపా
పంబులెల్ల • మాటూరివాసా॥ ౩౪

కం॥ ఉంచవెజగములు కుక్షిని । బెంచవె తజ్జనులఁ దండ్రి•
పెంచినమాడ్కిన్ । యెంచగ నేనీతనయుఁడ । మంచిగన
ను బ్రోవుతండ్రి • మాటూరివాసా॥ ౩౫

కం॥ యెన్నివిధంబులఁ జూచిన । మన్ననగల ప్రభువవీవె • మాధవనిన్నున్ । యెన్నఁగఁజాలను దాసుఁడ । మన్నింపఁగ వచ్చునయ్య • మాటురివాసా॥ ౧౦౨

కం॥ రామా రాఘవ దశరథ । రామా నిను నమ్మినాడ • రఘుకులతిలకా। స్వామి నను నేలుటకు ర। మ్మా మారుతిని కదీనుఁడ నని • మాటురివాసా॥ ౧౦౩

కం॥ హరినారాయణ మాధవ । నెరనమ్మినవాఁడ నిన్ను • నీ దాసుఁడనై । నిరతము నే సేవించెద । మరువకు నామీఁది కరుణ • మాటురివాసా॥ ౧౦౪

కం॥ నగధర నిను బహువేడితి । నగుబాటులు చేయకయ్య • నమ్మినబంటన్ । నిగమస్తుత ఫలమిడి సిరి । మగఁడా వడి బ్రోవునన్ను • మాటురివాసా॥ ౧౦౫

కం॥ శ్రీధరహరి నామదియే । గాథల జడలేక నిన్ను • గట్టిగఁ దలఁచున్ । బాధలను బొందనీయక । మాధవ నరసింహరూప • మాటురివాసా॥ ౧౦౬

కం॥ హరిగోవింద జనార్దన । గరుడధ్వజ చక్రహస్త • కంసధ్వంసీ । కరుణింపుము కరుణింపుము । మరిగితి నీ పాదయుగము • మాటురివాసా॥ ౧౦౭

కం॥ దర్పక హరసేవిత పద । సర్పకులాధిపతిశయన • సాంద్రగుణచయం । బేర్పడ శతకము జెప్పి స । మర్పణగావింతు నీకు • మాటురివాసా॥ ౧౦౮

కం॥ మాటురి వేంకటదాసుఁడ । నీటుగ శతకంబు జెప్పి • నిశ్చలభక్తిన్ । ధాటిగ గృతినీకిచ్చితి । మాటికి నన్నేలవయ్య • మాటురివాసా॥ ౧౦౯